శ్రీహయగ్రీవాయనమః

# శ్రీ వీరహనుమత్తారావళి.

ఇయ్యది,

సకలసుధీజనవిధేయుండునగు

విన్నకొండ వెంకటనరసింహాచార్యవర్యునిచే

రచియింపబడి,

పెద్దలచే పరిశోధింపబడి,

మల్కాపుర నివాసియగు

పిల్లలమఱ్ఱి సత్యనారాయణగారి ద్రవ్యసహాయముచే

చంద్రికా ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి

ప్రకటింపబడియె.

గుంటూరు.

1918

వెల రు 0-1-0



ఉ॥ మారుతినం స్తవంబిది న భక్తి మనంబునందునర్
జేరిచి వ్రాసెగాన నరసింహ సత్కవితావిశేషముల్
నేరనివాడు యిందుగలనింద్యముల న్వరికించకర్ రసం
బారయ సంగ్రహించుడి నయాత్మసుధీవరులార! గూర్మితోర్ ।

సీ॥ శ్రీమందడాన్వయ సింధురాట్సంపూర్ణ
సోముడై యెవ్వాడు సొంపుగాంచె
ధీ సద్గుణగణాంబుధీ సమర్ధతగాంచి
వసుధలో నెవ్వాడు వన్నెకెక్క-
రహించు మల్కాపురగ్రామమునకెల్ల
కరణమై యెవ్వాడు ఘనతగాంచె

సర్వయాచకకోటి సంతసింపగ నవ్వ
డమితధర్మక్రియ లనుసరించె
గీ॥ నట్టి హనుమంతరావుగా రార్యహితుడు
సత్కవివిధేయు డతిభక్తి సహితముగను
దీని దిరముగ నచ్చుయొత్తింప జేసి
యతులితంబుగ కీర్తి తానవధరించె॥



# శ్రీ వీరహనుమత్తారావళి

శా॥ శ్రీసీతారమణీశ పాదయుగ సంసేవాధురీణాత్మ వి
ద్యాసంయుక్త విభాసమానగుణ సాంధాప్రవంగేశ్వరా
భ్యాసంబొప్ప భజింతు నీపదయుగం బద్దీన్నతంబున్నవ
ద్దాసుం జేనుయటంచు వీరహనుమంతా భక్తచింతామణీ॥ 1

శా॥ లోకం బద్భుతమొంద నెమ్మిని ధరాలోకంబు బూరించగా
నేకం దూరువుకొండపైకిజని యావిఖ్యాతమా లోహితా
స్తోకాకారుని బాలభాస్కరుని సంతోషంబుచే మ్రింగగా
దాకన్నోర్చియితివౌర వీరహనుమంతా భక్తచింతామణీ॥ 2

శా॥ శాంతంబైన గుణంబు దాల్చియుచు యత్రాంతంబు సద్భక్త మ
తాత్యంతర్భావముల న్గ్రహించి తగ నెయ్యంబొప్పగ న్వారి సు
స్వాంతంబు ల్ముదమొందు గోర్కెలిడు నీసత్యంబు నెన్నంగ న
త్యంతంబయ్యె ధరిత్రిలోన హనుమంతా భక్తచింతామణీ॥ 3

శా॥ వందేయంచు భజింతు నీప్రపదముల్ వాగ్భూషణంబైన వి
ద్యం దే దెమ్మికదాల్తు జిహ్వపయి సంధానంబుగా నెవ్వడే
దిందేహాయని వేడనిత్తువని నీదివ్యప్రభావంబు నా
నందంబొప్పగ విన్నవాడ హనుమంతా భక్తచింతామణీ॥ 4

శా॥ ధీరాత్ముండవు సత్యవర్తనుడవౌ దివ్యప్రభావుండవౌ
నీరేజాతకులాప్తతేజుడవు రాశింజెందు దేహుండవౌ
పారావార గభీరుడౌ యనుచు నిన్భావించుమర్త్యాళి హృ
త్సారాంభోజముల న్వసించు హనుమంతా భక్తచింతామణీ॥ 5

శా॥ సత్యంబాదుర్షు నీదునమ్మతిని పీనంబాతయైన న్జను
ల్నిత్యంబు న్దగనల్పె నేని రుజము ల్నిక్కంబుగా మానుటల్
యత్యంతంబు భవత్పదంబులను శే హర్షంబుతో గొల్తు నా
న్నత్యాగంబున చెల్వమీరు హనుమంతా భక్తచింతామణీ॥ 6

శా॥ ఘోరప్రేతపిశాచధాటిని యనే ఘోరంబులౌ బాధలన్
భీతిం జెట్టిన వారు భవత్పాదవ సంప్రీతి న్భావన న్సేయగన్
హేతుల్ శీఘ్రములై నశించు నటులన్ యిమ్మార్తుల్యాపలన్ద్రోడి త
న్మాత్రద్దల్చుచు శాపహా హనుమంతా భక్తచింతామణీ। 7

శా॥ పాపారణ్యకుఠారమై రుజల సత్పంకేరుహాభంబునై
ప్రాపై భీతిలతాలవిత్రమయి సద్భక్తౌఘమందారమై
యేపార న్భువిలో ప్రభావమహిమన్ యెందేని పఠియించు నీ
దా పుస్సేరితి గావు వీరహనుమంతా భక్తచింతామణీ। 8

శా॥ రాముండంప జవంబుతోడ వెస పారావారమున్దాటి యా
భూమీజాతను లంకలోన గని సమ్మోదమ్ము చేవచ్చి త
త్క్షేమంబంతయు జెప్పి తత్పతికి సంసేవాపరత్వైక సం
ధామత్వంబున చెన్నుమీరు హనుమంతా భక్తచింతామణీ॥ 9

శా॥ నానారూపవికారరాక్షసుల సేనల్చుట్టుముట్టంగ వి
న్యాసంబొప్పగనున్న సీతగని దైత్యోన్మాదము న్మాపగన్
నేనేజాలుదు సెల్వొసంగుమని బల్మెయ్యంబుతో బల్కి తు
ద్ధానక్షాంతిదలిర్ప వీరహనుమంతా భక్తచింతామణీ ॥ 10

శా॥ అల సుగ్రీవహితుండవై జనకజాతాధీశ భక్తుండవై
యులక్ష వ్యాకులాంతకుండవయి మానీశాది తేయప్రమూ
ఖ్యులచే వర్ణితదివ్యమూర్తివయి సద్యోద్భూతసత్వంబుచే
తలసద్భక్తుల బ్రోచు వీరహనుమంతా భక్తచింతామణీ ॥ 11

శా॥ యంత్రంబేటికటంచు భూతభయరుగ్మానీకము ల్బాపగా
వింత్రా నీదగుభూజలజ్ఞనులు సేవిన్నాంజనేయంబనే
మంత్రంబున్పఠియించచాయు నిడుము ల్మాత్ర్యాళికంచున్ భవ
త్తంత్రం బేమనిజెప్పవచ్చు హనుమంతా భక్తచింతామణీ ॥ 12

శా॥ ఘనవాలోద్ధతిచేత రావణునిలంక న్వేట్కతో భూతిరా
సినిగా జేసితివీర శౌర్యమున వాసిన్మీరగానట్టి నీ
మన మొప్పార భజంచు టే సమయమున్మానక జగత్త్రాణ నం
దన కారుణ్యముతోడగావు హనుమంతా భక్తచింతామణీ॥ 13

శా॥ ఘనమా నీకిది జాగుసేయుటలు నాకందోయికి న్గానుః
చిన జాలంటిగాదె దేవ యికనీచిన్నె ల్వేసక జూపుమా
మన మొప్పారభజింతు నీప్రపదపద్మం బాంజనీదేవి న
న్దన ప్రాభశరీర వీరహనుమంతా భక్తచింతామణీ॥ 14

మ॥ అతిదీర్ఘంబులు నీదుబాహువుల పెంపాస్యంబు చంద్రుదిర
స్కృతిసేయందగు లోచనద్వయము నీ తేజమ్ములన్నించు
శ్రీపతి సద్భక్తిదలిర్పు నెమ్మనము నీవాలాహతిగోత్ర సం
తతులైన న్వడిగూల్పవచ్చు హనుమంతా భక్తచింతామణీ॥ 15

మ॥ నయనానందయమూర్తివంచు నిను యన్నాళ్ళు యొక్కైన
లేకను బత్తిగ్భజియించుచుంటినిగదా కారుణ్యమేపై
నజూపనురావేమిర ప్రోవ నీకు మరినేపాత్రుండగాదే. రం
జనరూపాంబుజనారి వీరహనుమంతాభక్తచింతామణీ 19

మ॥ భయముల్దీర్పగ నిన్నువేడవలె శుంభద్వానరాకారసి
నయచాతుర్య గుణాదికారణము లెన్నంజాలుశక్త్యుండనే
నియతంబై తగుభక్తిభావమున నిన్నేనమ్మియున్నారనన్
దయతోనేలుము వీరవీరహనుమంతా భక్తచింతామణీ॥ 20

శా॥ శక్తుల్వెట్టిన బాధకున్వెరచి లోశంకన్భయభ్రాంతినే
యుక్తిశ్శృన్నగలేరు మానవులు యీయుర్విస్థలిన్ గంటి త
చ్ఛక్తిన్గోల్దిగ నిన్ను నెమ్మనమునన్ సాధించిగొల్చేటిన
ద్భక్తేజాలునటంచు వీరహనుమంతాభక్తచింతామణీ॥ 21

మ॥ భువిలోకాందరు గానలేక తగనీభూరిప్రభావంబుకో
తివటంచున్ న్నుతియింపకుండినను నేద్దేవామదిన్మర్త్యక
స్భవదంఘ్రిద్వయము న్భజించెదను బ్రోవన్గోరి నిన్నెసదా
తవసద్భావమసాధ్యమెన్న హనుమంతా భక్తచింతామణీ॥ 22

శా॥ పంతంబేర భవత్కృపామహిమజూపన్వేగరావమ్మ నా
చింతల్బాపగనీవె దిక్కనుచు నాచిత్తమ్ము నమ్మియ
శ్రాంతంబుందగ గొల్చుచుంటినిగదా శాంతస్వభావంబున
త్యంతంబున్వహియించినట్టి హనుమంతా భక్తచింతామణీ॥ 23

శా॥ శుంభత్ రాముని భక్తి నెమ్మనమున న్సొంపొప్పగన్దాల్చి సం
రంభంబున్దగవార్ధి గట్టుటకు నారంభంబుచేబూని నీ
జృంభంబు న్వెసజూపితౌర ప్లవగబృందంబులో మేటివై
దంభత్వంబున ధీర వీరహనుమంతా భక్తచింతామణీ॥ 24

మ॥ గ్రహాసంఘాత లతావితానములచిత్రంబైన దివ్యవి
గ్రహాసంకీర్తన జేసి ద్రుంచదగు నారా నీప్రభావంబు నీ
మహి నెంచందగువారు లేరనుచు ముమ్మారు న్వెసన్బల్కెదన్
దహితారిప్రకటాగ్రవాల హనుమంతా భక్తచింతామణీ॥ 25
మ॥ మనమొప్పారగ పాత్రముల్మరియు నేమాన్యంబు గన్గొరి నే
ఘనమౌరీతివచింపలేదుగద నీకారుణ్యమేమిక్కిలై
దనరంగ న్విరమించినాడ నిదిగో తారావళిందాల్చుచు
న్ఘనతన్ మల్కాపురీనివాస హనుమంతాభక్తచింతామణీ॥ 26
శా॥ శ్రీ వైఖానససంతతిన్ మిగుల వాసిన్మీరుచున్నట్టి యా
శ్రీ విన్కొండకులాబ్ధిసోముడనగన్ శ్రీనారసింహుండనన్
శ్రీవిఖ్యాతగుణుండనంగి భువిలో చెన్నొందు నీపైన స
ద్భావంబొప్పగ వ్రాసినాడ హనుమంతా భక్తచింతామణీ! 27

సంపూర్ణము.

చంద్రికాముద్రాక్షరశాలయందు వెలకుదొరకు గ్రంథములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | సత్యహరిశ్చంద్రీయము. | ... | రు 1 | 0 | 0 |
| 2 | బుద్ధిమతీవిలాసము. | ... | 0 | 12 | 0 |
| 3 | సాత్రాజితీ[illegible]ము. | ... | 0 | 14 | 0 |
| 4 | చిత్రమాధవము. | ... | 0 | 12 | 0 |
| 5 | కీర్తికాంతాస్వయంవరము. | ... | 0 | 4 | 0 |

వలయువారు, మానేజరు.

చంద్రికాప్రెస్,

గుంటూరు.

అని [illegible]యుచు.

